సంపుటము 4] నవంబరు 1917 [సంచిక 5

# బాలమిత్ర



## గర్వము నాశమునకు ముందు నడచును

ఆనందపురమని పిలువబడు పట్టణంబున నొక బాలికా పాఠశాల యుండెను. ఆ స్కూలునందుఁ జదివిన బాలికలలో నొకతె కుంటిదై యుండెను. ఈమె నడకను, రోజీన యను పేరుగల చిన్నది వెక్కిరించుచు సదా హేళన చేయుచుండెను. అంత నా గాలులేని చిన్నది, తన్ను దూషించుచున్న, రోజీనాతో, "అమ్మాయీ! నీవంటి గర్విష్ఠుల మన

మును దీనతలో నుంచుటకయి, నా కీ గాలులేమిని, నిన్నును నన్నును బుట్టించిన దేవుం డుత్పత్తిచేసి యుండగా, నీవేల మిట్టిపడుచూ, హేళన చేతువు" అని హెచ్చరించుచుండినను, మఱింత బిగ్గఱగాఁ గొల్లుపెట్టి నవ్వ నారంభించుచుండెను. ఇట్లుండ నొకదినమున నీ పాఠశాల ప్రధానోపాధ్యాయుని జన్మదిన మహోత్సవంబు రాగా, లడ్డు, బూంది, జిలేబి, గుప్‌సప్, మొదలగు తినుబండము లీ బాలలుగొని, పంతులు గారితోఁగూడ, నాటిసాయంతనము, మూడున్నర ఘంటల కాలములో, దాపునున్న దోపునకుఁ బయనమయిపోవ నా దోటలోఁ జేరి, పులివచ్చె మేకలుబెదురునను దేశీయనాటను నాడ నిశ్చయించి, రోజీ నను చిన్నదానిఁ బులిగాను, తక్కిన బాలలందరు మేకలుగాను వీడ్కొలిపి ఆటఁ బ్రారంభించిరి. ఇట్లాడుచుండగా, నీ రోజీన, జింకపరుగిడునట్లు బహు గర్వము గలదై యతి త్వరితంబుగఁ బరుగెత్తుచుండగా, గాళ్లుజారి పడినందునఁ జట్టున దన గుడికాలు విరిగినదై నేమియుఁ దోచక, బాబో, నానో, అని ఏడ్చుట కారంభించగా, నచ్చటనుండిన నారీమణులును, ఉపాధ్యాయుడును, ఆసుపత్రి కామెను గొనిపోయి, స్వస్థత నిమిత్త మచ్చటనే నుంచిరి. నీ వృత్తాంత మా గుంటిచిన్నదాని జెవిని బడగానే, ఆమె చింతించి దేవుడు దొడ్డవాడని ఆయనను కీర్తించెను.

## కీర్తన

పడకుడిచెలులు—గర్వము—పడకుడిచెలులు
నాడేమైన దేవుఁడు మీ—తోడునుండి జీవవాక్య
జాడఁజూప నడుగుడి మీ—నడత సరిగఁ జేసికొనుచు || పడకుడి ||

1. ఎంతటిడబ్బు—నుండిన—పంతము పడకు
ఎంతటి రూపునుండిన నీ—వంతితగ్గియుండు తల్లీ
సంతసమున దేవుడు నీ—చెంతను జేరి వరమిచ్చును ధరను || పడకుడి ||

2. పేదసాదలను—జూచిన—బాధపర్చకు
మోదంబుగను జూచి వారిని—నాదరించు మెపుడు తల్లీ
యేదశ మనకెపుడువచ్చునో—యెరుగము ఈ ధరణిలోన || పడకుడి ||

---

# బాలురకు నీతిపద్యములు

వేకువనె లేచి పనులెల్ల • వెసనుఁ బ్రీతిఁ
జేసికొని పాఠశాలకు • చేరవలయు
బాల్యమున విద్య చక్కఁగా • బట్టుజుమ్ము ?
దానమేలొందుదువు ముందు • ధరణియందు. గీ. 1

గీ. పాఠశాలను వీడగా • పరుగులిడుచు
పొరుగువారల యిండ్లకు • బోకు మెపుడు
వారు కోపించుటయె కాక • వరుస తల్లి
దండ్రి గురుఁడును దండించు • దగదు వత్స. 2

ఆ. వె. ఇంటికేగునప్పు ♦ దంటరా దెవ్వరిఁ
దుంటవనుచు నిన్ను ♦ దూలనాడు
జంటవారలెల్ల ♦ జాలగా దూషించు
తంటవచ్చుపనుల ♦ దలఁపవలదు. 3

ఆ. వె. పెట్టినట్టివానిఁ ♦ బ్రేమతో భుజియించి
వేళ తప్పకుండ ♦ వెళ్లి బడికి
పాఠములను నీవు ♦ బాగుగా వల్లింప
గురుఁడు కోపపడఁడు ♦ గూడుఁ దెలివి. 4

ఆ. వె. మలిన హీనమయిన ♦ వలువలు ధరియించి
బుద్ధితోడ తలను ♦ పాసగదువ్వి
పాఠశాలకేగ ♦ బాలురు నినుజూచి
యటులఁ జేయుచుందు ♦ రాశతోడ. 5

ఆ. వె. పెట్టెలోనిడబ్బు ♦ పెద్దవారెరుఁగక
తీయబోకు మెపుడుఁ ♦ దిట్టుఁగొట్టు
నటుల ముందుఁజేయ ♦ నభిలాష గలుఁగును
గాన యట్టిపనులు ♦ మానవత్స. 6

---

# త్రొక్కుడుబండి వీరుడు

ప్రస్తుతము జరుగుచున్న యుద్ధములో, ఒకసారి ఒక ఆంగ్లేయ సేనాధిపతి, ఫ్రెంచి పటాలమొకటి, చాటున దాగి



యున్న జర్మన్ వారి బలమైన ఫిరంగిపటాలము మధ్యకు తెలియకనే పోవుచుండినటుల కనుగొనెను. ఇంక కొన్ని వందల గజములదూరము వెళ్లినయెడల, తిరిగివచ్చుట కెవరికిని సాధ్యము కాదు. గాన అతడు వెంటనే తనయొద్దనున్న త్రొక్కుడు బండి హర్కారులలో నొకనివెళ్లి ఆ సంగతి ఫ్రెంచినాయకునికి తెలుపుమని చెప్పెను. వాడాలాగుననే వెళ్లెను. జర్మనులదిగాంచి వెంటనే వాని కాల్చి చంపిరి. దీని కనుగొనగానే ఆంగ్లేయనాయకుడు మరియొకని ఆ పనికి నియోగించెను. ఇతడు తన బండి నతివేగముతో బోనిచ్చినను, కొంతసేపటికి, చేతులు వెనుకకువిసరి, ఒక్కక్షణములో క్రిందబడి ప్రాణము విడిచెను. ఫ్రెంచివారు, మత్సలముఖమును చొరబడ బోవుచుండిరి. ఆంగ్ల సేనాని మూడవ హర్కారివంక చూచెను. వానికా విపత్తెంత భయంకరమో తెలియునుగాని, క్షణమైనను వెనుకదీయలేదు. ఎగిరి బండిలోదూకి, బండిమీద పండుకొని, బహు త్వరితముగాబోయి, ప్రచండ వడగండ్ల వర్షమువలె, శత్రువుల తుపాకిగుండ్లు చుట్టుబడుచున్నను, లెక్క

సేయక ఆపద స్థలమును దాటి, ఫ్రెంచివారిని కనుగొని, నాయకుని కావార్త నెరింగించెను. అతడా సంగతిని సగమైనను చెప్పి చెప్పకమునుపే ఫ్రెంచినాయకుడు కన్నులెత్తి తానున్న అపాయకర స్థలమును గుర్తించి వెంటనే వెనుకకుబోవ నాజ్ఞ నొసంగెను.

ఫ్రెంచినాయకుడు మిగుల ధైర్యశాలిగాన, తన రొమ్ముపై వ్రేలాడుచున్న శౌర్య బిరుదాంకితమును తీసి, హితుడా! నేనొక ప్రాణము రక్షించినందుకే నాకిది యొసగిరి, గాని నీవనేకుల కాపాడగలిగితివి, గాన నీకే దీని ధరింప నర్హుడవని యాతని దానితో నలంకరించెను.

---

## తల్లి పరముకొఱకు

ఒకయోడ రేవులోనుండెను. అచ్చటకు వచ్చినపిదప ఫిరంగులుకాల్చ ఉత్తరువాయెను. అదే సమయమున అచ్చటనుండి ఫిరంగులలో మందుగుండ్లుపెట్టు బాలుని కోటు జారి సముద్రములో పడెను. నీళ్లలోకి దుమికి దాని తెచ్చుకొనుటకు సెలవడిగెను, గాని పాపము దొరకలేదు. ఒక నిమిషమైన పిదప వాడు రెండవ వైపునకుబోయి ఎగిరి నీటిలో దుమికి కోటు దెచ్చుకొనెను. గాని వానికి సంకెళ్లువేసి చీకటి

కొట్టునందుంచిరి. మరునా డాతని విమర్శకై నావికా సేనాధిపతియొద్దకు దెచ్చిరి. విచారించినమీదట ఈ సంగతి తేలెను. ఆయాజ్ఞ నియ్యకముందుగా వాడు తన తల్లిపటమునుజూచి, దానికొక ముద్దుబెట్టి కోటుజేబులో పెట్టుకొనెను. ఆజ్ఞనియ్యగానే కోటు నీళ్లలో పడినందున వాడు దాని దెచ్చుకొనుటకై దుమికినట్లు కనుగొనిరి.

సేనాధిపతి కండ్లనిండ నీరు గ్రమ్మెను. "నే నితనిపూర్ణముగా క్షమించుచున్నాను. తన తల్లిపటమునే కాపాడుకొనుటకై ప్రాణముపెట్టుటకు వెనుకదీయనంత ప్రేమగలవానికి ఈ ఓడమీద సంకెళ్లువేయు వీలులేద"నెను.

---

# ప్రకృతి పాఠములు

### 39 వ-పాఠము

### కండరములు

### (గతసంచిక శేషము)

శరీరమంతటిలోని చలనములను కలిగించు కండరముల సంఖ్య బహు గొప్పదైయున్నది. ఒక్క చేతియందుమాత్రము 50 కండరములుగలవు. శరీరమంతటిలో దాదాపు 450 కండరములున్నవి. ప్రతికండరమును సన్నని దారములవంటి పదా

ర్థముతో చేయబడుచున్నది. ఈ ప్రతిదారమువంటి దానికి ప్రత్యేకమగు నొకపనిగలదు. ఈ కండరములన్నియు మెదడుతో సంబంధించిన నాడులను కలిగియున్నవి. ఈ నాడుల ద్వారా, కండరము లేమిపని జేయవలసియున్నవో మెదడు దెలుపుచుండును. ప్రతికండరమునందును శాఖోపశాఖలుగా చెదరి కండరమంతయు వ్యాపించియున్న చిన్నచిన్న నాడులనేకములుగలవు. టెలిగ్రామంతయు ఒకే మనుష్యునికి బోవునట్లుగా, మనస్సుపంపు సమాచారము కండరమంతటికి ఒకేసారిబోక, దారములవంటి పదార్థములయొద్దకు బోయి అవి చేయవలసిన పనిని దెలుపును. వాటన్నిటికి ప్రత్యేకముగా ఒకటే కబురు దెలిసినను అవన్నియుగలిసి ఒకటే పనిని జేయుట చూడగా ఎంతో ఆశ్చర్యము గలుగకతీరదు.

ఏదైన ఒక బలము కలుగుటకు కొన్ని కండరములైనా పని జేయవలసియున్నది. ఒక్కొక్కప్పుడు అనేక కండరములు గలిసి పనిజేయును. ఇట్లు జరిగినప్పుడు కండరములలోని దారములవంటి ఈ పదార్థమున కనేక వర్తమానములు వచ్చును. ఉదాహరణముగా, నీచేతిని ఎత్తుటనుగూర్చి తలంచుము. చేతినెత్తునది ఒక్క కండరముగాదు. నీ మనస్సు ఎత్తవలెనను కబురును, నీ వెత్తవలసిన చేతిలోనున్న కండరములయందలి దారములవంటి పదార్థమున కంతటి కంపియున్నది. ఆ చేతిని మరియొకరీతిగా నెత్తుము. మరియొక తరహా

కబురా కండరములకు వచ్చియున్నది. గాన ప్రతి విధ చలనము నకు ఒక్కొక్కతరహా కబురుగలదు. ఇట్టి సంగతులు జరుగుట యసాధ్యమని తలంచవచ్చును గాని అలాగు జరుగుచునేయున్నది.

చేతి నెత్తునప్పుడే యింత గొప్పపని జరుగుచున్న యెడల ఎంతోవడిగా ఫిడేలుమీదగాని మద్దెలమీదగాని, పియానో మీద గాని వాయించునప్పు డెంత వేగముగా నీ కబురులు వచ్చు చున్నవో ఊహించుకొనుము. అదే సమయమున నతడు పాడుచున్న యెడల, మనస్సు ఒకేసారి వానిరొమ్ము, కంఠము నోటియందున్న కండరములకును కబురులు పంపుచున్నది. ఇదిమాత్రమే గాక కబురులు పంపునప్పుడే, ఆయా ఇంద్రియ ములనుండి కబురులను తెలిసికొనుచున్నది. ఆ వాయిద్యధ్వనులు చెవిద్వారా మనస్సున కెక్కుచున్నవి. చేతికొనలనుండియు కబురులు పోవుచున్నవి. ఆహా! ఎంత చిత్రమైన నిర్మాణము, ఇంత వింతైన శరీరము నెంతజాగ్రత్తగా కాపాడుకొనవలసి యున్నామో తెలిసికొని యుంటిరా?

(సంక్షేపము)

---

# ఏది కోరెదవు?

సంతోషముగా నుండుటకు ప్రయత్నించుటవలన అలాగున నెల్లపుడును ఉండగలము. ఒక కలపదొడ్డిలో షికారు చేయుట కిద్దరు స్నేహితులు వెళ్లిరి. అక్కడనున్న చెక్క

లలో కొన్ని బహు చక్కనివాసన గొట్టుచుండెను. వారిలో నొకరు "ఇదిగో చూడు, ఆ చెక్క లెంత చక్కనివాసన గొట్టు చున్నదో!" అని రెండవవానితో ననెను.

"ఆ చెక్కలా! అవి అంత మంచివాసన గొట్టునా? గాని ఈ దిక్కుననున్న ఈ మురికికాలువనుండివచ్చు కంపెంత అసహ్యముగా నున్నదో చూడు" మని రెండవవా డనెను.

మొదటివాడు, "వద్దు, వద్దు, ఈ చెక్కలవాసనే బాగున్నది" అనెను. ఈలాగున మనము మంచివాటినిగూర్చి మాత్రమే తలంచి వాటి నభ్యసించిన సంతోషమునే అనుభ వింతుము.

ఒక బోర్డింగు పాఠశాలలో పనిచేసిన దొరసాని యొకతె ఒకనాడు తన యింటియొద్ద స్నేహితులతో మాట్లాడు చుండెను. ఆమె ఆ బడియందుండు కాలములో కష్టనష్టము లెన్నియో అనుభవించియుండెను.

వారిలో నొకరు "అమ్మా! మీ బడియందున్న వారంతా మీలాగే సంతోషముగా నుందురా?" ఆమె చిరునవ్వుగల ముఖముతో "ఏలాగో నాకు తెలియదుగాని మంచిసంగతులను తప్ప మరివేటిని జ్ఞప్తియుంచుకొనను" అని జవాబిచ్చెను.

ఇదెంత సత్యము! మనకుకలుగు దుఃఖములను మరచి సంతోషకరములగు సంగతులనే జ్ఞప్తియుంచుకొనుటచే నెట్టిమేలు లభించును?

పండుకొనబోవునప్పు డొక చిన్ని బాలిక తల్లితో "అమ్మా! దానియేలుకథను జెప్పుమ"ని యడిగెను. అందుకు తల్లి ఆ కథచెప్పితే నీవు సింహములనుగూర్చి కలకనుదువు. గనుక "వద్దులే" యనెను. అప్పుడా బాలిక "లేదులేదు, సింహములను వదలిపెట్టి దానియేలునుగూర్చి మాత్రమే కలగంటాన"ని చెప్పినది. మనమును మనకుకలుగు కష్టములను సింహములను వదలగలిగినయెడల మన బ్రదుకులు మరెంత సంతోషకరములుగా నుండును.

---

# బైబిలు పిల్లలు

## అబ్షాలోము

విరాలు దివరకు దావీదునుగూర్చి చదివియుంటిరిగదా! నేడు వాని కుమారుడగు అబ్షాలోమునుగూర్చి చెప్పెదను. దావీదు మహారాజునకనేకమంది భార్యలు గలరు. అది తప్పయినను ఆకాలమున జీవించినవారంత గొప్ప నేరమని తలంచలేదు. కొందరు రాజులు అతనిచే జయింపబడి తమ కుమార్తెలను అతని కిచ్చి వివాహము చేయుటద్వారా తమ సంబంధము స్థిరపరచుకొనిరి. అబ్షా



లోము తల్లియు ఒక సామంతరాజు కూతురై యుండెను. ఆమె ఇశ్రాయేలీయురాలుగాదు.

అబ్షాలోము బహు చక్కనివాడు. అతనియంత అందగాడు లేడనియే చెప్పవచ్చును. అతనివి నల్లనివెండ్రుకలు. స్త్రీలా వెండ్రుకలను చూచి అట్టివి తమకును ఉంటే ఎంతో బాగుండు ననుకొనేవారట. ప్రతిసంవత్సరము వాటిని కత్తిరించి, అవెంత బరువుండునో అంత బంగారమును తూచి బీదలకిచ్చువాడు. దావీదున కితనిపై మిగుల ప్రేమ. తల్లి

దండ్రులచే ఎక్కువగా ప్రేమింపబడువాడు తప్పక చెడును గదా. మనలో ననేకులవలెనే, అబ్షాలోము వారిప్రేమను జూచుకొని బహు అతిశయపడెను. అతడు కోరినదెల్ల రాజు చేయువాడు. రాజుగారి కేమితక్కువ? గాని ఇతని విషయములో మాత్రము కొంచెము బుద్ధి తక్కువయినదనియే చెప్పవలెను.

ఒకసారి వాని మారు అన్న ఒకడు అబ్షాలోము చెల్లెలిని చాల అవమానపరచినందున అబ్షాలోము వానిని చంపి పగ తీర్చుకొనెను. కొంతకాలమువరకు ఆతడు తండ్రి యొద్దకు బోనప్పటికి, అతడు వానిని క్షమించి తిరుగా చేర్చుకొనెను.

కొంతకాలమునకు అబ్షాలోముకు విపరీతబుద్ధి బుట్టెను. తండ్రిరాజ్యము అపహరింపగోరెను. కుట్రలుచేసెను. కొంతకాలమువరకు అతనికే జయముకలిగెను. గాని చివరకు ఈరీతిగా ఓడిపోయెను. దావీదు యుద్ధమునకు బయలుదేరెను గాని అతని సైనికులు అతని రావద్దనిరి. వారు వెళ్లునప్పుడు, రాజు వారితో అబ్షాలోమునెడల దయజూపుడనెను. యుద్ధమగుచుండగా అబ్షాలోము ఓడిపోయి పారిపోయెను. ఒక దట్టమైన అడవిలోగుండా పోవుచుండగా వాని తలవెండ్రుకలు ఒక ముండ్లకు తగులుకొనినందున అతడు వ్రేలాడెను. క్రిందనున్న గుఱ్ఱము వెళ్లిపోయెను. అతనిజూచిన కొందరు సేనాధిపతితో జెప్పగా అతడు వెళ్లి,

అబ్షాలోము బ్రతికినయెడల దేశమునకు కష్టమగునని తలంపుతో వానిని చంపి పాతిపెట్టెను. దావీదీ సంగతిని విని చాల విచారపడెను. గాని ఏమిచేయగలడు?

బిడ్డలారా! అవిధేయతయు, ఎదిరింపును ఎట్టి దుర్గతికి దెచ్చునో చూచితిరా?

---

## బాలమిత్ర టపా




నా ప్రియబాలమిత్రులారా!

నేను ప్రతినెలకు మీయొక్క బాలమిత్రలను జదువుకొనుచు, అనుదినము చాలా ఆనంద భరితుడనై, నేను కూడను వ్రాయదలంచియుంటిని, గాన నాయొక్క కోరిక

నెరవేరినందుకు, దేవునికి స్తోత్రములు చెల్లించుచున్నాడను. నేను సి. యం. యస్. బోర్డింగునకు చేర్చబడి సుమారు 3 సం॥ అయినది. ఈ మూడు సంవత్సరములనుండి రెవ. ఆర్. డబ్లియు, పీచీదొరగారి సహాయమువల్ల, సి. యం. యస్. హైస్కూలునందు IV. ఫారం చదువుచున్నాడను, నాయొక్క తండ్రి ఉత్తర ప్రదేశమందు రోలుపడిఅను గ్రామమునందుండి, తిరువూరు పాస్త్రేటునకు గురుపని చేయుచున్నాడు. నాకు ఒక సహోదరుడును, ఒక సహోదరియును గలరు. వీరిలో నేను జ్యేష్ఠుడను. వీరిద్దరును చిన్నవారైనందున యింటిదగ్గరనే యున్నారు. గాని నేనొక్కడనే యిక్కడ విద్యాభ్యాసము చేయుచుంటిని. ఇక్కడ బోర్డింగులో 27 గురము న్నాము. మేమందరమును మాకు గలిగిన మీటింగులను క్రమముగా జరుపుకొనుచు వాటిని యింకా అభివృద్ధి చేయుచున్నాము. ఆలాగు మీరును చేయగలందులకు వేడుకొనుచున్నాను. మరియు, మాతో సమానులైన యితరులకు "ప్రభువుయొక్క ప్రేమనుగూర్చి" వివరించుచుంటిమి.

నా ప్రియులారా! నేను మీకు ఒక చిన్నసంగతినిగూర్చి తెలుపుచున్నాను. అది యేదనగా?

1 కొరింథీ 9 అ. 16 వచనములో "నేను సువార్తను ప్రకటింపక పోయినయెడల నాకు శ్రమ" అని పరిశుద్ధుడైన పౌలు వ్రాసినప్రకారము, మనము సువార్త ప్రకటింపక

పోయినయెడల, మనకు శ్రమయని ఒక్కొక్కరము తెలిసి కొని, ఆయన నామమును ప్రకటింపవలసినది. ఎందుకనగా మనము ఆయనవారమై యున్నాము గనుక మనవిధియై యున్నది. ఈ ప్రకారము మనము జరిగించుటకును తెలియనివారి కందరకు ఆయనమహిమ తెలుపబడులాగున తన పరిశుద్ధాత్మను, దయచేయవలయునని ప్రార్థించ గోరుచున్నాను. మీరందరును మన పరమతండ్రియైన యెహోవాను ఈ విషయమై అనుదినము ప్రార్థించవలెనని మిమ్ములను వేడుకొనుచున్నాను.

ఇట్లు సలాములతో
మీ ప్రియబాలమిత్రుడు
డీకొల్లు. జాన్ జ్ఞానసుందరము
బెజవాడ

C. L. S. PRESS, MADRAS—1917